హరిః ఓం

శ్రీగురుభ్యోనమః

సర్వవేదసారజనితానర్గళ సంసారతరణియను,

# శివజ్ఞానాష్టకస్తోత్రం
# అన్నావధూత వాగ్భూషణము

శ్రీమద్బృహద్వాసిష్ఠసిద్ధాంతనిర్ధారణులైన,
శ్రీమత్పరమహంసాదిబిరుదాంకితులగు భూమానంద
అన్నావధూత స్వాములవారిచే
సర్వజనులకు కైవల్యప్రాప్తి జెందచేయునటుల రచియింపఁబడియె

ఇది

సచ్చిదానంద వేంకటేశ్వర అవధూతగారి ప్రేరణచే
బ్రహ్మశ్రీ గౌరావఝ్ఝుల - రామకృష్ణ
సచ్చిదానంద సద్గురుస్వామి వారిప్రియశిష్యులైన
సికిందరాబాద
వైశ్యశ్రీ గుండా- భూమయ్యగుప్తగారి ద్రవ్యసహాయముచే

:-o-:

చీకోటివీరన్న అండుసన్సుగారి సుబోధ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు

౧౯౧౪

వెల ౧ అణా.

హరిః ఓం

శ్రీగురుభ్యోనమః

సర్వవేదసారజనితానర్గళ సంసారతరణియను,

# శివజ్ఞానాష్టకస్తోత్రం
# అన్నావధూతవాగ్భూషణము

శ్రీమద్బ్రహ్మవిద్యాసిష్ఠసిద్ధాంతనిర్ధారణులైన,
శ్రీమత్పరమహంసాదిబిరుదాంకితులగు భూమానంద
అన్నావధూత స్వాములవారిచే
సర్వజనులకు కైవల్యప్రాప్తిజెందచేయునట్టుల రచియింపఁబడియె

ఇది

సచ్చిదానంద వేంకటేశ్వర అవధూతగారి ప్రేరణచే
బ్రహ్మశ్రీ గొరావఝ్ఝుల - రామకృష్ణ
సచ్చిదానంద సద్గురుస్వామి వారిప్రియశిష్యుండైన
శికిందరాబాద
వైశ్యశ్రీ గుండా- భూమయ్యగుప్తగారి ద్రవ్యసహాయముచే

:-o-:

చీకోటిపిరన్న అండునన్నగారి సుబోధ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె
మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు
౧౯౧౪
వెల ౧ అణా.

ఈగ్రంథము యీదిగువ కనుపరచిన వార్లవద్ద విక్రయింపబడును.

౧. పాలుకెం క్రిష్టన్న
స్టాంపువెండరు కోర్టాఫీసు
శికింద్రాబాద్
రిజిమెంటుబజారు

౧. గుండావీరయ్య అండుసన్సు
బుక్ సెల్లర్
శికింద్రాబాద్ జనరల్ బజారు

౧. గుండావెంకటప్పయ్య
బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్
హైదారాబాద్ దివాణ్ దేవుడి

భూమానంద అన్నావధూత విరచితగ్రంథములు



యివిఅన్నియు రెండవకూర్పునందు ఒకచోటచేర్చి బయిండు చేయబడును సదరు గ్రంథమునకు అన్నావధూత అనుభవామృత సాగరమను పేరు యివ్వబడును. వెల రూ॥ ౧.

యీగ్రంథము వలయువారలు యీక్రింద చేవ్రాలు చేయువారికి తెలియపరచవలెను.

సవరణకర్త
సచ్చిదానంద వేంకటేశ్వర
అవధూతగారు

కార్యదర్శి
గుండాభూమయ్యగుప్తగారు
శికిందాబాద

ప్రేరేపకులు
పాలుకం కిష్టన్నగారు స్టాంపువెండరు కోర్టాపీసు
శికిందాబాద్ - రిజిమెంటుబజారు

శిష్యుడు అమరాంబీర వెంకయ్యగారు.



గురుడు భూమానందఅన్నావధూతస్వామి

శ్లో॥ అన్నావధూతపాదారవిందామృతరసాస్వాదనం
విపన్నత్తే తిభృంగాయవీర వెంకయ్యాపమంభజే॥

శ్లో॥ వేపుంన్వాయసజ్జాతం వేదాన్తామ్బుజభాస్కరం।
వేఙ్కటాచార్యగురోశ్శిష్యమన్నయార్యమహంభజే॥

శ్రీరస్తు

# శివజ్ఞానాష్టకస్తోత్రం

శ్లో॥ అకారో హ్యుకారో మకారస్తురీయస్త్ర్యవస్థాదిలోకత్రయమ్ప్యస్యభూతం।
నచస్త్వం స్వవాచ్యార్థమిత్యాస్యరూపం పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం॥

శ్లో॥ న గోత్రం న శీలం న మే జాతిభేదాః న మాతా పితా వా న మే శత్రుమిత్రే।
నచాదిర్న మధ్యం। నచాంత్యం న రూపం। పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం

శ్లో॥ దినం నైవ మే నైవ రాత్రిర్న సంధ్యా న కాలో న స్నానం న మంత్రో న హోమః।
సదాత్వేకమాద్యంతశూన్యం లసన్తం పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం॥ ౩

శ్లో॥ న మే చాక్షిజిహ్వాత్వచం ఘ్రాణకర్ణా న వాక్పాణిపాదా న చోపస్థపాయూ।
న మే పంచప్రాణా న మే స్థూలసూక్ష్మం పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం॥

శ్లో॥ న మే విష్ణురుద్రౌ న మే పద్మయోనిర్న చాత్మా పరాత్మా న జీవో న చేశః।
న మే సద్గురుః శిష్య దేవో న భక్తః పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం॥ ౫

శ్లో॥ నచాహం న చిత్తం న మే బుద్ధిరూపం న మే మానసం నైవ తాపత్రయాణి।
నిరస్తాఽతిసర్వాద్విరాభాసతుర్యం పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం॥ ౬

శ్లో॥ నచాఽస్తిర్న భాతిర్న చాఽనన్దరూపం న వాఽస్తిర్న ధర్మశ్చ మే కర్మసంజ్ఞే।
నచోపాధిసత్యం న సత్యం న దేహః పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం॥ ౭

శ్లో॥ పరబ్రహ్మ చైకం స్వరజ్ఞోఽతత్త్వం న వాచ్యాఽర్థలక్ష్యాఽర్థభావం నిరస్తం।
ఇదం సర్వమాయామయం దృశ్యజాలం పరబ్రహ్మలక్ష్యార్థమేకం శివోఽహం

శ్లో॥ అవస్థాయాఽత్యక్తతం స్తోత్రం శివజ్ఞానాష్టకం సదా।
యః పఠేద్భక్తిసంయుక్తస్స యాతి పరమాం గతిం॥ ౮

ఇతి శ్రీమత్పరమభూమానందయోగీంద్ర శ్రీమదన్నావధూతవిరచిత
శివజ్ఞానాష్టకస్తోత్రం సమాప్తః
శ్రీగురుపరబ్రహ్మార్పణమస్తు.
ఓం తత్సత్.

శ్రీమదఖండసచ్చిదానందగురుపరబ్రహ్మణేనమః

# అన్నావధూతవాగ్భూషణం.

---

శ్లో॥ ఓంనమోగురునాథాయ । రాజరాజేశ్వరాయచ।
బోధానందస్వరూపాయ । భూమానందాయ తేనమః॥

లోకమందొకానొక పురుషుండనేకజన్మాంతరములనుండి నిత్యనైమిత్తికాదికర్మల ఫలసంగరహితుఁడై యాచరించి పరిశుద్ధాంతఃకరణుండై సర్వముకర్మనిర్మితమని యోచించి దేహేంద్రియాద్యభిమానంబువిసర్జించి సంసారసాగరంబు తరించుటకై యొకానొకబ్రహ్మవేత్త చరణారవిందంబులసేవించి సాధనచతుష్టయ సంపదయనెడు కానుక చేతబట్టుకొని హే గురునాథా పరమదయాపరమమూర్తులగు దేవరవారు నాయందత్యంత కరుణగలవారై నన్ను ఈయనిత్య సంసార సాగరంబును అతిసులభోపాయముగా దాటించగలరని నేనుత్రికరణశుద్ధిగా మిమ్మునమ్మియున్నాను కాబట్టి యేవిధముగానైన నన్ను తిరిగిజన్మమునకు రానివ్వని స్వస్వరూపజ్ఞానంబునాకు కటాక్షించవలయునని వేడగా ఆబ్రహ్మవేత్త అత్యంత సంతోషముగలవాఁడై నాయనా నీవుభయపడవలశినదిలేదు నీవుసంసారసముద్రమును అతిసులభముగాతరించెదవు నిశ్చలచిత్తుఁడవై నేనుబోధించు వాక్యములయందు సావధానచిత్తుండవై వినుమనిసద్గురుండిట్లనియె. ఓశిష్యా నాలుగువేదముల యుపనిషత్తులయందు నాలుగుమహావాక్యములు కలవు అవియేవనగా ఋగ్వేదజ్ఞానకాండయందు 'ప్రజ్ఞానంబ్రహ్మ' అనేలక్షణావాక్యమున్ను యజుర్వేదజ్ఞానకాండయందు 'అహంబ్రహ్మాస్మి' యనేఅనుభవా

నుష్టానవాక్యమున్ను సామవేదజ్ఞానకాండమందలి 'తత్వమసి' యనేగురువాక్యమున్ను అధర్వణవేదజ్ఞానకాండమందలి 'అయమాత్మాబ్రహ్మ' యనేసాక్షాత్కారవాక్యమున్ను యీనాలుగు మహావాక్యములయొక్క అర్థవిచారమువలనకలిగినజ్ఞానంబువల్లనీవు సకలసంశయరహితుండవై జన్మమరణతరంగములుగలిగిన సంసారసముద్రంబును తరించి ముక్తుండవయ్యెదవుగావున నిశ్చలచిత్తుండవై వినుమని యిట్లనియె. మొదటిలక్షణవాక్యమునకు ప్రజ్ఞానమనియు బ్రహ్మమనియు రెండుపదములు యేవాక్యమందైనను వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞానము కారణముకాబట్టి మొదటపదార్థవిచారమేచేయవలశినది. ప్రజ్ఞానమనగా * శ్లో॥ ఏనేక్షతే శృణోతీదం। జిఘ్రతి వ్యాకరోతిచ। స్వాదస్వాదు విజానాతి। తత్ప్రజ్ఞానముదీరితం॥ అర్థము॥ అంతఃకరణ వృత్తితోగూడి నేత్రములగుండా చూడబడ్డ రూపంబులనేజ్ఞానంబులవల్ల తెలియబడుచున్నదో చెవులగుండా వినబడ్డ శబ్దంబు నేజ్ఞానంబువల్ల నిదియొకానొకశబ్దమని తెలియబడుచున్నదో చర్మముగుండా స్పర్శను యేజ్ఞానంబుచేత గురుతెరుగబడుచున్నదో జిహ్వేంద్రియంబువల్ల వుప్పుపులుసు మొదలుగాగలషడ్రుచులేజ్ఞానంబుచేత తెలియబడుచున్నవో ఘ్రాణేంద్రియంబువలన సువాసనదుర్వాసన లేజ్ఞానంబుచేత తెలియబడుచున్నవో యేజ్ఞానంబుచేత వాక్పాణిపాయూపస్థలకు విషయములగు వచనదానగమనవిసర్జనానందంబులు తెలియబడుచున్నవో నేజ్ఞానంబుచేత సకలేంద్రియములనుండి సమస్తవిషయంబుల తెలియబడుచున్నవో అట్టి జ్ఞానమే ప్రజ్ఞానమని వేదాంత సిద్ధాంతము అయితే యీప్రజ్ఞానమునకు ఈదేహేంద్రియ మనఃప్రాణాదులన్నియును వాచ్యార్థంబులు గాన యిన్నింటిని గురుతెరిగే జ్ఞానమే ప్రజ్ఞానమని నిశ్చయించుకోవలశినది. శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు। మనుష్యాశ్వగవాదిషు। చైతన్యమేకంబ్రహ్మతః ప్రజ్ఞానంబ్రహ్మమయ్యాపి ॥అర్థము॥ బ్రహ్మవిష్ణురుద్రేంద్రాదిదేవతులయం

దును మనుష్యులయందును అశ్వములు గోవులు మొదలైన సమస్తశరీరాదులయందును పిపీలికాదిబ్రహ్మపర్యంతమున్ను యిప్పుడు చెప్పబడ్డ ప్రజ్ఞానమేయుండి సమస్తమునుగురు తెరుగుచున్నదిగనుక యీప్రజ్ఞానమే బ్రహ్మమని వేదాంతసిద్ధాంతము, ఇందుకు బ్రహ్మాది పిపీలికాంతమైనశరీరంబులన్నియును వాచ్యార్థము, ఇన్నింటిని గురుతెరిగే సచ్చిదానందమైన బ్రహ్మమే లక్ష్యార్థము ఇఘను (అహంబ్రహ్మాస్మి) యనేవాక్యార్థము ఈవాక్యమునకును అహమనిన్ని బ్రహ్మమనిన్ని అస్మియనిన్ని మూడు పదములుగలవుగాన మొదట అహమను పదంబున కర్థంబెటువలెననిన శ్లో॥ పరిపూర్ణపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణి । బుద్ధేస్సాక్షితయాస్థిత్వా స్ఫురన్నహమితీర్యతే ॥అర్థము॥ అవిద్యాసంబంధమైన దేహేంద్రియమనఃప్రాణాదులకు అధికారియైనబుద్ధికి సాక్షియై పరిపూర్ణమై ఆత్మయై యేదిగలదో ఆయాత్మే అహమను పదమునకులక్ష్యార్థము యిప్పుడుచెప్పిన దేహేంద్రియ మనఃప్రాణాదులన్నియును వాచ్యార్థములుగాన యీవాచ్యార్థములుమిథ్యాభూతంబులని యిన్నింటినిగురుతెరిగే అఖండసచ్చిదానందాద్వయ లక్ష్యార్థమేనేనని నిశ్చయించవలసినది ఇఘను బ్రహ్మమనుపదమునకర్థంబెటువలెననగా * శ్లో॥ స్వతఃపూర్ణపరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః ॥ అర్థము॥ సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందున్ను స్వతస్సిద్ధమై సర్వత్రాపరిపూర్ణమై బ్రహ్మమనుశబ్దముచేతవర్ణింపబడ్డపరమాత్మయేదిగలదో అదేబ్రహ్మపదమునకు లక్ష్యార్థము ఇఘను యీచెప్పబడ్డదేశకాలావస్థాదిసమస్తంబును బ్రహ్మపదంబునకు వాచ్యార్థము గావున యీవాచ్యార్థములు నిరసించగా మిగిలినసత్యజ్ఞానానందమే బ్రహ్మమని నిశ్చయించవలశినది ఇఘను. అస్మియనేపదమునకు * శ్లో॥ అస్మీత్యైక్యపరామర్శః। తేనబ్రహ్మభవామ్యహం॥అర్థము॥యిప్పుడుపైనచెప్పిన అహంబ్రహ్మపదములయొక్క వాచ్యార్థములనిరసించగా మిగిలినలక్ష్యార్థ

మొకటేయని అహంపదమునకు లక్ష్యార్థమగు సచ్చిదానందకూటస్థాత్మే బ్రహ్మపదమునకు లక్ష్యార్థమగు సత్యజ్ఞానానంద బ్రహ్మమనిన్ని తత్స త్యజ్ఞానానందబ్రహ్మమే సచ్చిదానంద కూటస్థాత్మయనిన్ని యీ ాత్మపర మాత్మలకభేదంబగు ఐక్యమునస్మియను పదంబు బోధించునుగనక యీ బోధయందు నిశ్చలచిత్తుండగు బ్రహ్మవేత్త బ్రహ్మమేనేను నేనేబ్రహ్మ మనని నిశ్చయించి యీయనుసంధానంబు సర్వదేశసర్వకాల సర్వావస్థ లయందాచరించుచు నిర్భరులైయుండువారే జీవన్ముక్తులనివేదాంతసిద్ధాం తము. యిందుకుసందేహంబు లేదు ఇఘను తత్వమసియనేగురువాక్యమునకు తత్పదమనిన్ని, త్వంపదమనిన్ని, అసిపదమనిన్ని, మూడు పదములు యిందుకు మొదటిదైన తత్పదంబునకు ✽ శ్లో॥ ఏకమేవాద్వితీయ్యంసన్నా మరూపవివర్జితం। సృష్టేఃపురాధునాప్యస్య। తాదృక్త్వంతదుదీర్యతే ॥ అ ర్థము ॥ సృష్టికిపూర్వమందు నామరూపములేనిదై తనకంటెవేరులేని దై ఒకటైనయేపరిపూర్ణబ్రహ్మగలదో అదేతత్పదమునకు లక్ష్యార్థము యిందుకువాచ్యార్థము సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వాంతర్యామిత్వాది గు ణంబులుగలిగి మాయామయమగుకారణోపాధియేదిగలదో అదేతత్పదవా చ్యార్థము ఇఘనుత్వంపదంబునకు ✽ శ్లో॥ శ్రోత్రదేహేంద్రియాతీతం। వస్తుత్వంపదేరితం ॥ అర్థము ॥ శ్రోత్రాదిజ్ఞానేంద్రియములద్వారా శ బ్దాదివిషయములనున్ను వాగాదికర్మేంద్రియములద్వారా వచనాదివిష యములనున్ను మనాదిఅంతఃకరణచతుష్టయములద్వారా సంకల్పాదివి షయములనున్ను ప్రాణాపానాదులద్వారా క్షుత్పిపాసాదులున్ను యేజ్ఞా నముచే తెలియబడుచున్నదో ఆకూటస్థాత్మేత్వంపదలక్ష్యార్థము ఇప్పుడు చెప్పబడ్డ దేహేంద్రియమనః ప్రాణాదులున్ను అవిద్యాప్రతిబింబమున్ను కించజ్ఞత్వకర్తృత్వభోక్తృత్వాది గుణంబులుగలిగి అవిద్యామయమైన కార్యోపాధులన్నియును త్వంపదవాచ్యార్థములు గనక యీవాచ్యా

ధర్మములను గురుతెరిగేకూటస్థుడే యాత్మయని వేదాంతసిద్ధాంతము ఇఘను అసియ నేపదంబునకు ॥ శ్లో॥ ఏకతాగ్రాహ్యతేసీతి తదైక్యమనుభూయతాం॥ అర్థము ॥ ఓశిష్యాసృష్టికిపూర్వమందు నామరూపరహితమై అద్వయమై యఖండమై పరిపూర్ణమై యేబ్రహ్మముగలదో ఆబ్రహ్మమే యీపిండాండమందు కూటస్థాత్మయైప్రకాశించుచున్నదిగాన యీకూటస్థమైన యాత్మవేనీవు అని వాచ్యార్థద్వయనిరసనంబుచేసి యుభయపదంబులకు లక్ష్యార్థ మొకటేయని తల్లక్ష్యార్థంబగు నిరావరణపరిపూర్ణాద్వితీయ్యబ్రహ్మమేనీవని అసిపదంబఖండంబుగ బోధించుచున్నదిగావున యీవాక్యార్థవిచారమువల్ల కలిగినఫలమేమియనగా సంశయరహితంబేఫలమని వేదాంత సిద్ధాంతము ఇఘనుఅయమాత్మాబ్రహ్మ నేపదమందు అయమనిన్ని, ఆత్మయనిన్ని, బ్రహ్మమనిన్ని, మూడుపదములుగలవు యిందులో అయమనేమొదటిపదమునకు * శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వా । దయమిత్యుక్తతోమతం॥ అర్థము॥ స్వప్రకాశమైయపరోక్షమైనదే అయమనుపదమునకులక్ష్యార్థము ఇఘనుఆత్మపదంబునకు * శ్లో॥అహంకారాదిదేహాంతా।త్ప్రత్యగాత్మేతిగీయతే ॥అర్థము॥అహంకారము మొదలుకొని దేహాంతపర్యంతము వ్యాపించియున్న యేప్రత్యగాత్మగలదో అదేఆత్మపదమునకు లక్ష్యార్థము యిప్పుడు చెప్పిన అయమాత్మాయనెడి పదంబులకు దేహేంద్రియమనఃప్రాణాదులన్నియు వాచ్యార్థంబులని వేదాంతసిద్ధాంతము. ఇఘను బ్రహ్మపదమునకు అర్థమెట్లాగంటె * శ్లో॥ దృశ్యమానస్యసర్వస్య। జగతస్తత్వమీర్యతే। బ్రహ్మశబ్దేనతద్బ్రహ్మ। స్వప్రకాశాత్మరూపకం ॥అర్థము॥ దృశ్యమైనటువంటియీస్థావరజంగమాత్మకమైన యావత్ప్రపంచమునకు అతీతమై యేదిప్రకాశించుచున్నదో అదేబ్రహ్మపదమునకులక్ష్యార్థము యిప్పుడు చెప్పిన పిపీలికాది బ్రహ్మపర్యంతమున్ను స్థావరజంగమాత్మకమైన యీసమస్తదృశ్యప్రపంచము యావత్తున్ను బ్రహ్మపదమునకు వాచ్యార్థము.

అయితే స్వప్రకాశమైన కేవలాత్మకు బ్రహ్మమని శబ్దమాత్రనపలుకంబడ్డదిగాన నాశబ్దమే సమస్తప్రపంచమయమయినదిగాన తచ్ఛబ్దాతీతమైనదే బ్రహ్మమని వేదాంతసిద్ధాంతము యిందుకు యీనాలుగుమహావాక్యముల పదార్థంబులకన్నింటికేకార్థం బెటువలెననగా * శ్లో॥ మాయావిద్యే విహాయైవా। ఉపాధిపరజీవయోః । అఖండం సచ్చిదానంద। పరబ్రహ్మవిలక్ష్యతే ॥ అర్థము ॥ దేశకాలవస్తుత్రివిధపరిచ్ఛేదశూన్యంబైన సచ్చిదానందపరబ్రహ్మమే మాయాఉపాధివల్ల ఈశ్వరుడనిన్ని, అవిద్యోపాధివల్ల జీవుడనిన్ని, కోకిలఃపికయనుభంగి పర్యాయనామంబులుగలిగినట్టుగా తోచబడ్డది గావున తదుపాధిద్వయదోషరహితునకు అంతటాఅఖండసచ్చిదానంద పరబ్రహ్మమే నిశ్చయంబైయుండును యిందుకు, ప్రజ్ఞానమనిన్ని, అహమనిన్ని, త్వంఅనిన్ని, అయమాత్మాయనే పదములకన్నింటికిన్ని స్థూలసూక్ష్మకారణంబులనే దేహత్రయములున్ను జాగ్రితాద్య వస్థాత్రయములున్ను అన్నమయాదిపంచకోశములున్ను చతుర్వింశతి తత్వములున్ను యిన్నింటికికారణమైన అవిద్యనున్ను అవిద్యాప్రతిబింబంబులగు విశ్వాది జీవత్రయమున్ను స్వాధిష్టాన చిదాభాసునియొక్క కించిజ్ఞత్వ కర్తృత్వ భోక్తృత్వాది గుణంబులుంగూడి వాచ్యార్థంబులగును యీచెప్పబడ్డ వాచ్యార్థంబులకుసాక్షియై అంతరంగబాహ్యేంద్రియములను వాటివిషయములతోనున్ను గురుతెరుగుచుండే కూటస్థుడేలక్ష్యార్థము ఇతనుబ్రహ్మమనిన్ని తత్పదమనిన్ని యీపదద్వయములకు పిపీలికాదిబ్రహ్మపర్యంతమున్ను సమస్తస్థావరజంగమాత్మకమైన ప్రపంచముయావత్తున్ను మాయాప్రతిబింబేశ్వరవిరాటాదిత్రయంబును ఈశ్వరునియొక్క సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వసృష్టిపాలకలయత్వాది గుణంబులుంగూడి వాచ్యార్థంబులగును సృష్టికిపూర్వమందున్ను సృష్టివున్నప్పుడును సృష్టిలయమైనప్పుడును వొగటిచేత బాధింపబడక అచలమైయున్న నిరావర

ణపరిపూర్ణబ్రహ్మమేలక్ష్యార్థము ఇఘను అస్మియనిన్ని అసియనిన్ని రెం
డుపదములచేత యిప్పుడుచెప్పబడ్డ ప్రజ్ఞానపదఅహంపదత్వం పదఅయమా
త్మా పదంబులవాచ్యార్థంబులున్ను బ్రహ్మపదతత్పద వాచ్యార్థంబుల
నున్ను యీయుభయవాచ్యార్థంబులే మాయావిద్యలగు ఉపాధిద్వయం
బులుగనుక యీఉపాధిద్వయంబులు నిరసించగా అన్నిపదంబులకఖండము
గానిలచిననిరావరణాధిష్ఠాన పరిపూర్ణబ్రహ్మమేనీవని అసిపదంబుచేతను నే
నుబ్రహ్మమునైతినని అస్మియనుపదంబుచేతను అఖండముగా బోధించును
గనుక నీవుసకలసంశయరహితుండవై ఉపాధిద్వయదోషరహితుండవై నిరా
వరణపరిపూర్ణాద్వితియ్య బ్రహ్మమేనేనని నిశ్చయాత్ముండవైయుండు నీకు
బ్రహ్మ,క్షత్రియ,వైశ్య,శూద్రాది,వర్ణంబులును,బ్రహ్మచర్యాద్యాశ్రమం
బులును, సజాతియ్య, విజాతియ్య, స్వగతభేదంబులులేవు. నీవుకేవలపరిపూ
ర్ణాద్వితియ్యబ్రహ్మమాత్రుండవని సమస్తశృతిస్మృతి పురాణేతిహాసంబులు
బల్కుచుండుగాన, సర్వదేశసర్వకాలసర్వావస్థలయందున్ను యీమహావా
క్యార్థ విచారణవల్ల సకలసంశయరహితుండవై నిర్భరత్వంబున స్వస్వరూ
పానుసంధానమే పురుషార్థముగలవాడవైయుండవలయు నిందుకుసమ్మతి
*శృతి* జీవన్ముక్తిమవాప్యప్రారబ్ధప్రతిభాసనాశపర్యంతం స్వస్వరూపాను
సంధానేనవశేత్ । స్వస్వరూపసంధానంవినాన్యథాచార పరోనభవేత్॥
అర్థము॥ జీవన్ముక్తినిపొందినబ్రహ్మవేత్త ప్రారబ్ధాధీనమైనట్టిదిన్ని తనయం
దుఆభాసమైఆత్మకంటేవేరుగాదోచే యీదేహము నశించేపర్యంతమున్ను
స్వస్వరూపాను సంధానమేచేయవలశినది స్వస్వరూపానుసంధానము విడచి
యితరాంతర మతాంతర సాధనాంతరాద్యాచారంబులు పొందగూడదని
వేదాంత సిద్ధాంతము. యిందుకుసంశయములేదు అనగాశిష్యుండుముకుళి
తహస్తుండై,స్వామీ జీవన్ముక్తినిపొందవలయునని శృతిప్రమాణమువల్ల దే
వరవారు ఆనతిచ్చినారుగనక, ఆజీవన్ముక్తియనగానెట్టిది స్వస్వరూపాను

సంధానమనగానెయ్యదియో, దానినాకుసవిస్తారముగా బోధించవలశినదని వేడగా నాశిష్యునిమీాద అత్యంతకరుణగలవారై హేఅనఘా, జీవన్ముక్తి యనగా ప్రమాణములైన శృతిస్మృతిపురాణేతిహాసంబులయందు చెప్పబడుచున్నది అదియెటువలెనంటె ॥ శృతి ॥ జీవఃపంచవింశకః। స్వకల్పితచతుర్వింశతితత్వం పరిత్యజ్యషడ్వింశక పరమాత్మాహమితినిశ్చయాజ్జీవన్ముక్తో భవతి ॥ అర్థము ॥ యీాదేహేంద్రియమనఃప్రాణాదులయందు తానేయభిమానంబిదివరకువుంచిన నీయాత్ముండు తనస్వసంకల్పమువల్ల కల్పితమైన చతుర్వింశతితత్వములు అనగా జ్ఞానేంద్రియపంచకమున్ను కర్మేంద్రియపంచకమున్ను ప్రాణాదిపంచకమున్ను శబ్దాదివిషయపంచకమున్ను మనాద్యంతఃకరణచతుష్టయమున్ను కూడాయిరువదినాలుగుతత్వములు యీా తత్వము లేశరీరత్రయమనిన్ని అవస్థాత్రయమనిన్ని పంచకోశములనిన్ని చెప్పబడుచుండును కనక యీాతత్వములయందుండెడి యభిమానంబుగల యిరువదియైదవవాడగుజీవుండు యిప్పుడుచెప్పిన యిరువదినాలుగు తత్వములనుపరిత్యజించి యీాతత్వములను వాటివాటివిషయములయందు అన్వేప్రవర్తించుచుండగా వాటికిసాక్షిభూతుండై వాటినిగురుతెరుగుచుండే తనకుముఖ్యబింబభూతుండగు పరమాత్ముండనేనని నిశ్చయించిన పుణ్యపురుషుండేజీవన్ముక్తుండుయిదిగాక ॥ శ్లో॥ నేతినేతీతివాక్యార్థేన। శేషితంపూర్ణముచ్యతే ॥ అర్థము॥ యీా దేహమునేనుగానుయింద్రియములునేనుగాను వాటివల్లదెలియబడేయింద్రియములవిషయములునేనుగాను ప్రాణాదులునేనుగాను అంతఃకరణచతుష్టయమునేనుగాను యిందులో జన్మమరణవర్ణాశ్రమ ధర్మాదులకు అనుకూలమైన స్థూలశరీరములునేనుగాను క్షుత్పిపాస కామక్రోధాదులకనుకూలమయిన లింగశరీరమునేనుగాను అనాద్యవిద్యానిర్వాచ్యంబగు కారణశరీరంబునేనుగాను అన్నమయాది పంచకోశంబులు నేనుగాను అవస్థాత్రయములునేనుగాను నేను అవస్థాత్రయములయందు

ఒకటిపోయి ఒకటివస్తూవుండే యీఅవస్థాత్రయములచే ... ఒకటి
చేత బాధింపబడక యెప్పటికీ ఏకరీతిగా నేవుండి యీ చెప్పిన మూడు సమయములకుసా
క్షియై సర్వంబును గురుతెరుగుచుండెడి యాత్మనేనని సర్వాధిష్ఠానమైన యీ
విచారమందే మనస్సుస్థిరపరచడమే స్వస్వరూపానుసంధానమని వేదాం
తసిద్ధాంతము. ఇదిగాక * శ్రు॥ జీవస్థితివినాశేషు।నోదయాస్తమయేషుచ
సమమేవమనోయస్య। సజీవన్ముక్తఉచ్యతే॥ అర్థము॥ జననస్థితివిలయం
బులును, ఉదయాస్తమయములును, యేమహాత్మునకు సమానముగా
నుండునోఆతండేజీవన్ముక్తుండనిన్ని *శ్రు॥ యస్మాన్నోద్విజతేలోకే। లోకా
న్నోద్విజతేచయః। హర్షామర్షభయాన్ముక్తో। సజీవన్ముక్తఉచ్యతే॥
అర్థము॥ యేబ్రహ్మవేత్తలోకములకుభయపడడో, యేబ్రహ్మవేత్తలోక
మునుభయపెట్టడో సుఖదుఃఖాది ద్వంద్వభయములను విడువబడ్డపు
రుషుండెవడో, ఆతడేజీవన్ముక్తుండనుటకుసందేహంబులేదు. యీవిధంబుగా
సమస్తశ్రుతిస్మృతిపురాణేతిహాసములు నిస్సంశయంబుగా పల్కుచుండుగా
వున, నీవుయింతమాత్రమున్ను యేయొక్క వికల్పమున్ను లేక సర్వదేశ, స
ర్వకాల, సర్వావస్థలయందు, (అహంబ్రహ్మాస్మి) యనేమహావాక్యానుసం
ధానంబు జేయుచు తదర్థంబునందు మగ్నుండవై, తద్రూపుండవై, నిర్భ
రుండవై యుండుము. యిందుకు భగవద్గీతావాక్యము * శ్లో॥ తద్బుద్ధయ
స్తదాత్మాన। స్తన్నిష్ఠాస్తత్పరాయణాః।గచ్ఛన్త్యపునరావృత్తిం।జ్ఞాననిర్ధూ
తకల్మషాః॥ అర్థము॥ ఆయొక్క నిరావరణపరిపూర్ణాద్వితీయబ్రహ్మమేనే
నని నిశ్చయించి, ఆబ్రహ్మమందేనిష్ఠగలిగి, తత్పరాయణుండైనబ్రహ్మవేత్త
పునరావృత్తిరహితంబైన పదంబునుబొందును. యెందువల్లననగా జ్ఞానము
చేతసమస్తకల్మషములుపోగొట్టినవాడుగనుక నే, తానుపరిపూర్ణుండగునునిం
దుకుసందేహంపవలదని భగవద్వాక్యముగలదుగనక, నీవున్న ఆబ్రహ్మమం
దేనిశ్చయముకలవాడవై, యీబ్రహ్మమేనీయాత్మగాగలవాడవై, బ్రహ్మని
ష్ఠాపరుండవై, అఖండానందంబనుభవించుచు సుఖంబుండుమనిన శిష్యుండి
ట్లనియె. స్వామీ మీరానతిచ్చిన యీస్వస్వరూపజ్ఞానానుభవంబుపూర్వు
లందెవ్వరేవిధంబున ఆనతిచ్చియుందురో వారియనుభవంబు లెట్టివో శేవ
కునికి యుపదేశించగలందులకై ప్రార్థనచేయుచున్నానని విన్నపము చేయు

గా, దేశికేంద్రుండిట్లనియే. ఓ కుమారకా యిందుకు పూర్వులందరున్ను యీ అభేదమార్గమునే అనుసరించి ముక్తులైనారని సమస్త వేదాంతశాస్త్రములు బల్కుచుండునుగావున, నీమనస్సు దృఢంబుగా గలందులకు దృష్టాంతముగా కొందరియనుభవములు తెలియపరచెదను, నిశ్చలచిత్తుండవై వినుమని యిట్లనియే. ఓ పుత్రికా, అధ్యాత్మరామాయణ బాలాకాండలో శ్రీరామహృదయమందు, శ్రీరామచంద్రుండు ఆంజనేయులనుగూర్చి పలికినదేమంటే * శ్లో॥ ఐక్యజ్ఞానంయదోత్పన్నం। మహావాక్యేనచాత్మనోః తదావిద్యాస్వకార్యైశ్చ । నశ్యత్యేవనసంశయః ॥ అర్థము ॥ ప్రజ్ఞానాదిమహావాక్యములద్వారా పుట్టబడ్డ ఐక్యజ్ఞానమువల్ల, అవిద్యదానిస్వకార్యములతో కూడా నశించి ఆత్మపరమాత్మలనెడి భేదభావంబునిరసనంబై తానే బ్రహ్మంబగునని యున్ను, బాలాకాండప్రథమసర్గయందు యీశ్వరవాక్యము * శ్లో॥ రజ్జావహిమివాత్మానం।జీవోజ్ఞాత్వాభయంవహేత్ ।పరాత్మాహమితిజ్ఞాత్వా। భయదుఃఖైర్విముచ్యతే ॥ అర్థము ॥ త్రాడుపాము మొదలైనవాటిని చూచి సర్పమని భయమొందినట్లు తన్ను జీవునిగా యెంతపర్యంతము గురుతెరుగుచున్నాడో అంతపర్యంతమున్ను, భయదుఃఖములచేత పీడింపబడినట్లుండును. యిది సర్పంబుగాదు త్రాడనితెలిసిన తదనంతరము సర్పభయము నిరసనమైనట్లు నేను జీవుడనుకాను సాక్షాత్కారమైన పరబ్రహ్మమే నేనని నిర్భరుండైన బ్రహ్మవేత్త భయదుఃఖములచే విడువబడునని యున్ను * శ్రు॥ తరతిశోకమాత్మవిత్ ॥ అర్థము ॥ తన్ను దెలసిన బ్రహ్మవేత్త దుఃఖసాగరము తరించునని శ్రుతివాక్యము * శ్రు॥ బ్రహ్మవిదాప్నోతిపరం ॥ అర్థము ॥ బ్రహ్మజ్ఞానియైన ఆత్మవేత్త సర్వమునకు అతీతమైన పరబ్రహ్మమునే పొందును. యిందుకు సందేహము లేదు * శ్లో॥ బుద్ధిప్రాణమనోదేహ। హంకృతిభ్యోవిలక్షణః। చిదాత్మాహంనిత్యశుద్ధో।బుద్ధ్వవేత్తీతినిశ్చయః ॥అర్థము॥ ఓ శిష్యోత్తమా దేహత్రయ, అవస్థాత్రయ, జీవత్రయ, గుణత్రయ, పంచకోశ, పంచభూత దశేంద్రియ, ప్రాణపంచక, విషయపంచక, అంతఃకరణచతుష్టయాది, సర్వానకు విలక్షణమై, కాలత్రయాబాధ్యమై, శుద్ధమై, బుద్ధమై ప్రకాశించుచుండెడి చిదానందంబగు బ్రహ్మమే నేనని నిర్భరత్వంబుచేత నిశ్చయించినవాడే జీవన్ముక్తుండు, యిందుకు సందేహంబు లేదు గావున నీవున్ను నీచేతనెరుగబ

డుచుండే సమస్తదృశ్యజాలమంతయు మిథ్యయని, యిన్నింటిని తెలుపునట్టి సాక్షియైన సత్యజ్ఞానానంద పరిపూర్ణ పరమాద్వైత బ్రహ్మమే నేనని నిశ్చయించి నిర్భరుండవై యుండుమని హస్తమస్తకసంయోగంబు చేసిన తత్క్షణంబున శిష్యుండు పరమానందంబుచేతను ప్పొంగి, హేగురునాథా, మీకరుణావలోకనంబుచేత నిదివరకున్న జన్మమరణ తరంగంబులుగలిగిన అపారావారమైన దుఃఖసాగరంబు దాటి నిర్భరుండనైతినని పునఃపునఃప్రణామంబులుచేసి నిశ్చింతుండై * శ్లో॥ గచ్ఛంస్తిష్ఠన్నుపవిశన్। శయనో వాన్యథాపివా। యథేచ్ఛయావసేద్విద్వా। నాత్మారామస్సదామునిః ॥ అర్థము॥ నడుస్తున్నప్పుడును, నిలచినప్పుడును, కూర్చున్నప్పుడును, శయనించియున్నప్పుడును, సదామననశీలుడగు విద్వాంసుండు యథేచ్ఛగాతనలోతానే ఆనందరూపుండై యుండును. అయితే విద్వాంసుండనగా, విద్యలుసాధించినవాడు విద్వాంసుండుగానేరడు. మరియెవు నెవ్వరనగా * శ్లో॥ సర్వాంతరస్థస్సద్విద్యాపరియుక్తో విద్వాన్॥ అర్థము॥ సర్వాంతర స్థ[illegible] ప్రదేశములయందును, సార్వకాలములయందును, సమస్త వస్తువులయందును స్థావరజంగమాత్మకమైన సమస్తమందును వెలుగుచు ప్రకాశించుచుండి ఆసమస్తమును గురుతెరుగుచుండే జ్ఞానస్వరూపమునుగాగల ఆత్మను గురుతెరిగినవాడే విద్వాంసుండు॥ యీ పక్షమున శ్రీశంకరాచార్యస్వాములవారు మనీషాపంచకమందు * శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యాసంవిదుజ్జృంభతే। యాబ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ। సైవాహంనచదృశ్యవస్త్వితిదృఢప్రజ్ఞాపియస్యాస్తిచేత్ ఛండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషామనీషామమ ॥ అర్థము ॥ జాగ్రతయందును, స్వప్నమందును, సుషుప్తియందును. యీ అవస్థాత్రయములకు సాక్షియై వొకటిచేత చలింపబడక బ్రహ్మాదిపిపీలికాంతమైన సకలశరీరాలయందు మణులలోసూత్రంబువలెనే ప్రకాశించుచుండెడి నిరావరణాధిష్ఠాన పరిపూర్ణబ్రహ్మమేనేను. యీ దేహేంద్రియమనఃప్రాణాది దృశ్యప్రపంచమెల్ల నాచే తెలియబడేదిన్ని, మిథ్యాభూతమైనది, గనక నేయీమిథ్యాభూతమైన సమస్తదృశ్యప్రపంచమేమిన్ని నేనుగానని యిట్టిదృఢమైనప్రజ్ఞ యెవరియందుకలదో వారుఛండాలురేయవుగాక, సద్బ్రాహ్మణులేయవుగాక, అనగా ఛండాలులు మొదలు

బ్రాహ్మణుని పర్యంతము నెవరైనను వారే సద్గురువులని నమస్కారము చేస్తావున్నానని శంకరస్వాములవారు ఆనతిచ్చిరి గనక, యిందుకుఉత్తరగీతలయందు *శ్లో॥ అహంబ్రహ్మేతియస్సర్వం। విజానాతిచసర్వదా। మహాన్యాత్స్వయమరీన్నామ। సర్వాశీసర్వవిక్రియీ। సర్వంనిషేధంకృత్వాది। కర్మభిర్నసబధ్యతే ॥అర్థము॥ యేమహాత్ముడైనానేమి, సర్వము, బ్రహ్మేతివిఖ్యాతాః। బ్రహ్మవిదితిబహుధాశృతిః॥ యీసమస్తమున్ను పరబ్రహ్మమేనని అనేకశృతిస్మృతులుపలుకుచున్నవిగనక అట్టినిరావరణ పరిపూర్ణబ్రహ్మమే నేను, నేనేబ్రహ్మమని సర్వదేశసర్వకాల సర్వావస్థలయందును తన్నుతా గురుతెరుగుచుండెడి బ్రహ్మవేత్త, తనకుఅన్యమైన కామక్రోధాద్యరిషడ్వర్గయుక్తుండైనను, సర్వాశాపరుండైనను, సర్వవిక్రియుండైనను, లోకములోనింద్యమైనకర్మలుచేశినను, ఆయాకర్మలచేతకట్టుబడడనుచు అర్జునునకు ఉత్తరగీతలయం దానతిచ్చిరి, గావున యీరహస్యార్థంబునందుదృఢత్వంబుగలవాడే బ్రహ్మంబని వేదాంతసిద్ధాంతము॥

గద్య

ఇతిశ్రీమనోలయచిత్ప్రకాశ పరమభూమానందయోగీంద్ర
శ్రీమద్వేదాంతి అన్నావధూతవిరచితే గురుశిష్య
సంవాదే మహావాక్యవిచారణే
అన్నావధూతవ్యాఖ్యానం
సమాప్తః
సర్వంశ్రీగురుపరబ్రహ్మార్పణమస్తు
ఓంతత్సత్.

